ఆంధ్ర సారస్వత పరిషత్తు

# నివేదిక

213


పులిజాల హనుమంతరావు

(ప్రధాన కార్యదర్శి)


1949-1952


తేది 11-1-53 ] [వెల 0- 4-0

పరిషదధ్యక్షమహాశయా! ఆచార్య రాధాకృష్ణ విద్వన్మణీ!
సోదరీ సోదరులారా!

నమస్కరించి చేయువిజ్ఞప్తి.

1948 సర్వధారి సంవత్సరము హైదరాబాదు ప్రజలకు నూతన శకాన్ని ప్రసాదించింది. వందలాది సంవత్సరములు విదేశపరిపాలనలో అనుభవించిన యాతనలు అంతమొందినవి. చీకటులొక్కసారి తొలగిపోయినవి. వెలుగురేకలు వ్యాపించినవి. ఎదుగుబొదుగులులేక నిర్బంధములలో నిరుకుకొనిపోయిన ప్రాంతీయభాషా సంస్కృతులను పెంపొందింప జేసుకొనుటకు మంచి అవకాశము లభించినది తెలంగాణాలో నలుమూలల మాతృభాషాభిమానము వెల్లువవలె పొంగిపోయినది.

ఆంధ్రసారస్వత పరిషత్తును దక్కించుకొని బయటపడుటయే చాలునను గడ్డురోజులను పోలీసుచర్య తొలగించినది. ఆనాటినుండి యీనాటివరకు పరిషత్తు చేసిన కృషిని మీముందు నివేదించుకొనుట నా కర్తవ్యము.

పరిషత్తు ఆదర్శోద్దేశ్యములు:- ఆంధ్రసంస్కృతి మరియు సారస్వతముయొక్క సర్వతోముఖవికాసానికి కృషిసల్పుట.

ప్రజలలో నిరక్షరాస్యతను నిర్మూలించి, మాతృభాష ద్వారా విద్యావ్యాప్తిని నిగావించుట.

తెలుగుభాషలో పరీక్షలను జరుపుట.

వివిధకళలకు, శాస్త్రములకు, సంబంధించిన గ్రంథములను ప్రచురించుట.

సభలు, సమావేశాలు, కవిసమ్మేళనాలు జరిపి, విద్యావంతులయిన ప్రజలలో సారస్వతాభినివేశమును పెంపొందించుట.

ఫిబ్రవరి 1949 తూప్రానులో జరిగిన సభలు పరిషత్తునకు ఒక నూతన గమనాన్ని, నవోత్తేజమును కలిగించినవి. ప్రజలు వేలాది సంఖ్యలో సభలయందు పాల్గొనినారు. పరిషత్తు కార్యక్రమము ఒక మహో

ద్యమముగా, రూపొందుటకు అనువయిన బీజావాపన ఆసభలో జరిగినది.

పరిషత్తుకార్యరంగము విస్తృతమయినది. తెలంగాణమంతట పల్లె పల్లెలో పరిషత్తుశాఖలు స్థాపించబడినవి. తెలుగు పుస్తకములు చదువుఅభిరుచి పెంపొందింప జేయబడినది. ప్రయోజనస ఓటింగుపద్ధతి నెలకొల్పబడుచున్నదని తెలియగనే పల్లెప్రజలలో విద్యాసక్తి పెంపొందించుటకు పరీక్షలను ప్రతియేట రెండుసార్లు నిర్వహించుకార్యక్రమము ఆరంభింపబడినది. పరీక్షా కేంద్రములకు పర్యవేక్షకులను కేంద్ర కార్యాలయమునుండి పంపు ఆచారమును మొదటిసారి ఆంధ్రసారస్వత పరిషత్తు విద్యా సంస్థలలో ఆదర్శముగా ప్రవేశపెట్టినది. కేంద్ర కార్యాలయమునుండి పర్యవేక్షకులను పంపడము వ్యయప్రయాసలతో కూడుకొన్న కార్యమైనప్పటికి, కేంద్రమునుంచే కావలసిన ప్రయాణ వ్యయమును భరిస్తు, పరీక్షలను నిర్వహించినామని చెప్పుకొనుటకు గర్విస్తున్నాము. మా పరీక్షల నిర్వహణమును పరికించిన బాధ్యతకల విద్యాశాఖాధికారులు ప్రభుత్వ పరీక్షల నిర్వహణమునకు ఎంతమాత్రము తీసిపోవని ప్రశంసించుటయే యిందుకు నిదర్శనము. పరిషత్తు నిర్వహించిన పరీక్షలు (1) అక్షరాస్యత (2) ప్రాథమిక (3) మాధ్యమిక (4) ప్రవేశ (5) విశారద. ఆనాటినుండి నేటివరకు పై 5 పరీక్షలు, 187 కేంద్రాలలో నిర్వహింపబడినవి. పరీక్షలలో పాల్గొన్న విద్యార్థుల సంఖ్య- ప్రాథమికలో 7312, మాధ్యమికలో 8031, ప్రవేశలో 5730, 1950 నుండి విశారద పరీక్షలో 309. ఈ విధంగా మొత్తము 21073 విద్యార్థులు పరీక్షల నొసగియుండిరి. 1951 నుండి నిర్వహింపబడిన అక్షరాస్యతాపరీక్షలలో 1580మంది అక్షరాస్యులు పాల్గొని పరీక్ష నొసగినారు.

పరిషత్తునకు తెలంగాణమునందే కాక, బొంబాయి, షోలాపూరు, గుల్బర్గా, బీదరు, రాయచూరు వంటి ఆంధ్రేతర ప్రాంతములందును, మద్రాసురాష్ట్రములోని కొప్పిట్ల, పామర్రువంటి కేంద్రములందును పరిషత్తుశాఖలు, పరీక్షా కేంద్రములు కలవని చెప్పుటకు సంతసించెము. పరిషత్తు తన కార్యక్షేత్రమును తెలంగాణసీమావధులను

అధిగమించి వ్యాపింపచేయుటకు ఉత్తర సర్కారు, బొంబాయి, షోలా పూరాంధ్రులు తీర్మానముల ద్వారా పరిషత్తును కోరియున్నారు.

పరీక్షలస్థాయి :- పై పరీక్షలు ప్రభుత్వమువారి ప్రాథమిక మాధ్యమిక, ఉన్నత పాఠశాలల చదువుతో సమానస్థాయిని కలిగి యున్నవని చెప్పుటకు నిర్ణయించిన పాఠ్యప్రణాళికయే నిదర్శనము. పరిషత్తు ప్రవేశపరీక్షకు నిర్ణయింపబడిన పుస్తకము ఉస్మానియా విశ్వవిద్యాలయములోని యింటర్మీడియటు పరీక్షకు పాఠ్య గ్రంథముగా నిర్ణయింపబడిన దన్నచో పరీక్షలస్థాయి బోధపడ గలదు. తెలంగాణమున ప్రభుత్వము వారి ప్రాథమిక పాఠశాలలు గూడ లేని మారుమూలల గ్రామాలవరకు పరిషత్తు ప్రచారము వ్యాపించి గ్రామీణ శాలబాలికలకు విద్యావిజ్ఞానము మున్నగు సంప్రదాయము నెలకొల్పినది. ఇలాంటి భాషోద్యమమును సాగించుటకు తలపెట్టిన పరిషత్తుకు తగిన ఆర్థిక సహాయము ప్రభుత్వము నుండి లభించక పోయినది.

ప్రజలిచ్చిన సహకారము ద్వారానే పరీక్షాకార్యక్రమము కొన సాగింపవలసి వచ్చుటచే పరిషత్తు ఎన్నో బాధలకు గురికావలసి వచ్చినది. ఈ సందర్భములో పరీక్షా కేంద్రములలో ప్రభుత్వ విద్యాశాఖ వారు గూడ తోడుపడినందుకు పరిషత్తు పక్షమున కృతజ్ఞులము.

పరీక్షలు- ప్రభుత్వమువారి ఆమోదము :- ప్రభుత్వము వారిచే పరీక్షలనామోదింపజేసి దేశీయులకు ప్రోత్సాహమును, ప్రాథమిక విద్యాబోధనకు సౌకర్యమును కలిగించుటకు పరిషత్తు భగీరథ ప్రయత్నము చేయవలసి వచ్చినది. చాలా ఆలస్యముగా ప్రభుత్వము వారు పరిషత్తు పరీక్షలలో ప్రవేశను ఆమోదించిరి. కాని ఎన్నో షరతుల మధ్య నిరికించుటచే ఆ ఆమోదమువలన మేల్కన్న కీడులే యెక్కువ కలిగిన వని చెప్పుటకు విచారపడుచున్నము. ప్రభుత్వమువారు పరిషత్తు విశారద పరీక్షను ఆమోదించు సూచనలు కలవు. నెమ్మాని శేషమ్మగారు (శాస్త్రి) తన భర్త జ్ఞాపకార్థము విశారదపరీక్షలో ప్రప్రథమములుగా నెగ్గినవారి కిచ్చునిధి రు. ౧౧౧౬ ఏర్పాటుచేసినారు. పరిషత్తు వారు

నెమ్మాని శేషమ్మగారికి కృతజ్ఞతలు తెలియజేయుచు బాపట్ల శాఖా కార్యకర్తలను ప్రశంసించుచున్నాము.

ప్రచురణలు :- పరిషత్తు కార్యక్రమాలలో గ్రంథప్రచురణము ముఖ్యమయినది. ప్రచురణశాఖ ఉత్తమ గ్రంథాలను ప్రచురించింది. వీనిలో ముఖ్యమైనవి- ( చూడుడు, అనుబంధము ) 1949 నుండి పరిషత్తు 13 ఉత్తమ గ్రంథములు దాదాపు 2000 పుటలు గల 44000 ప్రతులు ప్రచురించినది. వీనిలో కొన్ని గ్రంథములు 2, 3, 4 మారులు గూడ ముద్రించబడినవి. శ్రీ సురవరము ప్రతాప రెడ్డిగారిచే రచింపబడిన ఆంధ్రుల సాంఘిక చరిత్ర యావదాంధ్ర దేశ పండితుల ప్రశంస లందినది. ఈ సందర్భమున పరిషత్తు పరీక్షల పాఠ్య పుస్తకముల ప్రచురణ నిమిత్తము మంచిరియాల ఆహ్వానసంఘపక్షాన సంఘాధ్యక్షులు శ్రీ రాజా మురళీమనోహరరావుగారిచే ౫,౫౦౦ విరాళ రూపమున బొందిన సంతోషకరమగు విషయమును సభాసదులకు తెలియజేయుట మా కర్తవ్యము.

వయోజన విద్యాప్రచారము :- పరిషత్తు ముఖ్యలక్ష్యా లలో వయోజన విద్యావ్యాప్తి మరియొక ప్రధానమైన ఉద్దేశ్యము. ఈ లక్ష్యసిద్ధికై పల్లె పల్లెలలో పరిషత్తు అక్షరాస్యతా ప్రచారము జరిపి, వయోజన విద్యావ్యాప్తిని సాగించు కార్యకర్తలకు పరిషత్తు అధ్వర్యమున హైదరాబాదులో ఒక శిక్షణ కేంద్రము నిర్వహింప బడినది. గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారివంటి విద్యావేత్తలు యీ కేంద్రానికి ఆహ్వానింప బడినారు. హైదరాబాద హైకోర్టు మాజీ ప్రధాన న్యాయమూర్తి శ్రీ ఆర్. యస్. నాయక్, శిక్షణ కేంద్రానికి ప్రారంభోత్సవం చేశారు. మొత్తము 110 మంది కార్యకర్తలు వయో జన విద్యాబోధ-లో శిక్షణను పొందినారు. వీరి కందరికి యోగ్యతా పత్రము లివ్వబడినవి. ఇప్పుడు పరిషత్తు తెలంగాణాలో 64 వయోజన పాఠశాలలు నడుపుచున్నది. (చూడుడు, అనుబంధము). సింగరేణిబొగ్గు గనుల కార్మికుల కొరకై, కొత్తగూడెము, ఇల్లెందు, శాస్త్రి, బెల్లంపల్లి మున్నగు ప్రాంతములలో 16 వయోజన పాఠశాలలు నిర్వహింప బడు

చున్నవి. ( ఇవి ప్రభుత్వము వారి సహాయమున పరిషత్తు పర్యవేక్షించు చున్నది. ) గ్రామాలలో 98 వయోజన పాఠశాలలు మరల తెరువ బడినవి. 3393 మంది వయోజనులు యీ పాఠశాలల్లో అక్షరాస్యు లైనారు. అంతేగాక వీరిలో 1580 మంది పరిషత్తు పరీక్షలకు కూర్చొ నగా 631 మంది ఉత్తీర్ణులైనారు. యువక కార్యకర్తలకు వయోజన విద్యాశిక్షణ గరపటానికై, ప్రతిజిల్లాలోను శిక్షణ కేంద్రాలను నడుప వలెనని ఒక సమగ్రమైన పథకమును పరిషత్తు సిద్ధము చేసినది. అయితే ప్రభుత్వమువారి ఆర్థిక సహాయము లేనిదే యిట్టి పథకము, అమలు జరుగుట దుస్సాధ్యము. ఈ కార్యకలాపాలలో ఒకభాగంగా 1951 ఫిబ్రవరి 17 వ తేదీ నుండి 21 వ తేదీవరకు పరిషత్తు తెలంగాణమంతట వయోజన విద్యావారము జరిపినది. పరిషత్తు, పంచవర్ష ప్రణాళిక సందర్భమున వయోజన విద్యావ్యాప్తికి కృషిచేయ తన ఆమోదమును తెలిపియున్నది. తెలంగాణమున నిర్మాణాత్మకముగా పరిషత్తు వయోజన విద్యావ్యాప్తికై జరిపిన కృషి సామాన్యమైనది కాదని చెప్పుటకు సాహసింతుము. 1950 లో జబలుపూరునందు జరిగిన ( అడల్టు ఎడ్యు కేషను సెమినార్ ) వయోజన విద్యా ప్రచార గోష్ఠిలో పరిషత్తు పాల్గొని యావద్భారతమున జరుగు వయోజన విద్యా ప్రచారపద్ధతిని ఆకళింపు చేసుకోగలిగినది.

తీర్మానములు, పరిషత్ప్రతినిధివర్గము:- తూప్రానుసభలో పరి షత్తు, హైదరాబాదు రాష్ట్రములోని విద్యావిధానమునుగూర్చి, ఉస్మా నియా విశ్వవిద్యాలయములో ప్రాంతీయ భాషలకు అగ్రస్థానము కల్పిం పబడవలెననియు, పరిషత్తు పరీక్షలు ప్రభుత్వముచే ఆమోదింప చేయ వలెననియు, ప్రాచ్యవిద్యాపట్టములు పొందిన పండితులకు విశ్వవిద్యా లయ పట్టభద్రులతో సమాన వేతనముల నీయవలయునని, హైస్కూలు తరగతులలో కూడ మాతృభాషలద్వారా విద్యాబోధన జరుగవలె ననియు తీర్మానములు చేయబడినవి. పరిషత్తుయొక్క కార్యవిధానమును రూపొందించుటకు పరిషత్తుపక్షమున ఆచార్య శ్రీ తణికెళ్ళ వీర భద్రుడు, శ్రీ యం. హనుమంతరావు, శ్రీ యస్. నరోత్తమరెడ్డి,

శ్రీ దేవులపల్లి రామానుజరావుగార్లతో కూడిన ఒక రాయబార వర్గము, ఆచార్య శ్రీ తణికెళ్ళ వీరభద్రుని అధ్వర్యమున అప్పటి విద్యా శాఖామాత్యులగు రాజా ధోండేరాజబహద్దూరుగారిని కలుసుకొని సంప్రదింపులు జరిపినారు. ప్రతినిధివర్గమువారు ప్రాంతీయభాషల ప్రాధాన్యమును గురించి జరిపిన చర్చలకు మంత్రిగారు సంతృప్తిచెంది హైస్కూలు తరగతులవరకు ప్రాంతీయభాషలయిన తెలుగు, మరాఠీ, కన్నడములలోను విద్యాబోధనజరుగవలెనని ఉత్తరువులు జారీచేసినారు. తరువాత ఇదే ప్రతినిధివర్గమువారు ఉస్మానియా విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షుని సందర్శించి విశ్వవిద్యాలయ బోధనములోగూడ ఏదేని ఒక ప్రాంతీయ భాషగాని లేక ప్రాచీన భాషలలో నొకదానినిగాని నిర్బంధ పఠనీయభాషగా చేయడానికి సమాలోచనలు సలిపిరి. అందు కుపాధ్యక్షు లంగీకరించిరి. కాని ఒక ప్రశ్నపత్రమునకు మాత్రమే అవకాశ మీయబడినది. పరిషత్తు యీవిధముగా ఒకఆదర్శమును సాధించటంలో విజయమును పొందినది.

హైదరాబాదకు భారత ప్రధానమంత్రి రాక సందర్భంలో ప్రాంతీయ భాషలను నిర్బంధ పఠనీయములుగా జేయడమేగాక, కాలేజీ విద్యయావత్తు ప్రాంతీయభాషలలోనే జరుపటానికి ఉస్మానియా విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులు ప్రకటించి ఉండిరి. అయితే ఏకారణముల చేతనో కాని వారి వాగ్దానములను చెల్లించుకోలేక పోవడము విచారకర విషయము. అంతట పరిషత్తు ప్రతినిధివర్గము తిరిగి శ్రీ మాడపాటి హనుమంతరావుగారి నాయకత్వాన విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షుని వద్దకు పోయి, వారిని వాగ్దానమును చెల్లించవలసినదిగా కోరడమైనది. అందుకువారు ఆశాభంగమును కలిగించనని సమాధానమిచ్చిరి. ఉస్మానియా విశ్వవిద్యాలయ నిర్వహణములో తీవ్రమయిన సంస్కరణలు రావడము అవసరమని పరిషత్తు వాంఛిస్తున్నది. ఉస్మానియా విశ్వవిద్యాలయమును కేంద్రప్రభుత్వము స్వాధీనముచేసికొని, దానిని హిందీ విశ్వవిద్యాలయముగా మార్చడాన్ని పరిషత్తు పూర్తిగా వ్యతిరేకిస్తున్నది. పరిషత్తు యీ విషయమున ప్రజాభిప్రాయమును ఢిల్లీ ప్రభుత్వమునకు

తెలియజేయుటకై హైదరాబాదలో ఏర్పడిన పౌరసంఘమునకు సహాక రించుచున్నది. అక్టోబరు 52 లో ఉస్మానియా విశ్వవిద్యాలయ ఉపా ధ్యక్షుల వద్దకు పరిషత్తు రాయబార వర్గమువారు వెళ్ళి, మద్రాసు ఆంధ్రా యూనివర్సిటీలలో బోధింపబడుమేరకైన మాతృభాషలకు ఉస్మానియా విశ్వవిద్యాలయములో అవకాశమును కలిగించవలెనని కోరుటయేకాక, బి. యస్. సి, కోర్సునుండిప్రాంతీయ భాషలను తొల గించు ప్రయత్నములను చేయవలదని కోరిరి. ఉపాధ్యక్షులు ఆంధ్ర. మద్రాసు విశ్వవిద్యాలయాలలోవలె ఇంటర్మీడియటు వరకు మాతృ భాషలలో బోధన ఏర్పాటు చేయుట కంగీకరించినారు.

ప్రజాభాషలో ప్రభుత్వ వ్యవహారాలు:- రాష్ట్ర పరిపాలనలో ప్రాంతీయభాషల కేమాత్రము స్థానము లేదు. జనాభాలో నూటికి తొంబదిమంది ప్రజలు తమకష్టసుఖాలను మాతృభాషలోనే పాలక వర్గము వారికి నివేదించుకొను భాగ్యము కలుగలేదు. ఈ యాటంక మును తొలగించడానికి పరిషత్తు ఆందోళన జరుపుచున్నది క్రిందికోర్టుల లోను, ప్రభుత్వ జిల్లా కార్యాలయాలలోను ప్రాంతీయ భాషలే ఉప యోగింపబడవలెనని పరిషత్తు కోరుచున్నది.

రాష్ట్రపతికి విజ్ఞాపన:- 1951 ఆగస్టు 30వ తేదీన రాష్ట్రపతి డాక్టరు రాజేంద్రప్రసాదుగారు హైదరాబాదకు విచ్చేసిన సందర్భంలో పరిషత్తు ప్రతినిధివర్గం ఆయనను కలుసుకొని, పరిషత్తు కార్యకలాపాలను వివరించునట్టి విజ్ఞాపనపత్రమును సమర్పించి ప్రభుత్వ సహాయము కోరుటేకాక, ఉస్మానియా విశ్వవిద్యాలయ పరిపాలన విధానము గురించి తన అసమ్మతి తెలియజేసినది.

వైజ్ఞానిక కార్యకలాపాలు :- కీర్తిశేషులయిన చెళ్ళపిళ్ళ వెంకట శాస్త్రిగారికి ఆస్థానకవి బిరుదప్రదాన మహోత్సవ సందర్భమున పరిషత్తు రజతకమలముతో సత్కరించి తన భక్తిని వెల్లడించినది. అదే సమ యమున అఖిలాంధ్ర పరిషత్తును స్థాపించవలెనను నిర్ణయమునకు వచ్చి యుండిరి. ఆ ఉద్దేశ్యముతోనే పరిషత్తు యీనాటి వరకు కృషిసల్పు చున్నది.

1950 నవంబరులో మహారాష్ట్ర కర్ణాటక సాహితీ సంస్థల సహకారముతో పరిషత్తు హైదరాబాద నగరములో సంస్కృతీ సంగమోత్సవములను జరిపినది. రాష్ట్రములోని మూడు ప్రాంతీయ భాషల సమ్మేళనము గంగా యమునా సరస్వతీ నదుల త్రివేణీ సంగమాన్ని స్ఫురింప చేసినది. అఖిలభారత సంస్కృతీ మహాసభ 1951 మార్చి నెలలో ఢిల్లీలో జరిగినది. పరిషత్తు కార్యదర్శి ఆసభలో పాల్గొన్నారు. పరిషత్తు అధ్యక్ష కార్యదర్శులు, అఖిలభారత సంస్కృతీ సంగమోత్సవ సభకు వ్యవస్థాపక సభ్యులుగా ఎన్నుకోబడిరి. ఈ యేడుకూడ ఆ సంస్కృతీ ఉత్సవాలు హైదరాబాదులో జరుపబడినవి. వాటిలో పరిషత్తుకూడ ముఖ్యభాగస్వామిగా పాల్గొన్నది.

హైదాబాదు కళాశాలల ఆంధ్రాభ్యుదయోత్సవములు జరుగుటకు పరిషత్తు యథాశక్తి ప్రోత్సాహము నొసగినది. ఉస్మానియా విశ్వవిద్యాలయములో ఆంధ్రాభ్యుదయోత్సవములు తొలిసారిగా జరుగుటలో పరిషత్తు భాగస్వామి అని చెప్పిన అతిశయోక్తి కాజాలదు.

ఆంధ్ర రాయలసీమ నాయకులు హైదాబాదు విచ్చేసినప్పుడు వారికి యిక్కడివారితో పరిచయము కలుగుటకు, ఆరు పరిచయగోష్ఠులను పరిషత్తు యేర్పాటుచేసినది. సాహిత్య సంస్కృతిక సంస్థలద్వారా ఆంధ్రుల సమైక్యతకు పరిషత్తు కృషిచేస్తూ వచ్చినది.

పండితసభలు-కవిసన్మానములు:- పరిషత్తు రాష్ట్రములో అనేక సారస్వత సభలు జరిపి ఉత్తమ కవి పండితుల నాహ్వానించి, సన్మానమొనర్చినది. అందు ముఖ్యముగా శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ, శ్రీ మునిమాణిక్యం నరసింహారావు, శ్రీ పింగళి లక్ష్మీకాంతం, శ్రీ నేలటూరి వేంకటరమణయ్య, శ్రీ గడియారం వెంకటశేషశాస్త్రి, శ్రీ తల్లావఝ్ఝుల శివశంకరస్వామి, శ్రీ డా॥లంకా సుందరం మొదలగు ప్రముఖుల నాహ్వానించి వారిద్వారా సాహిత్యక, చారిత్రక, వైజ్ఞానికోపన్యాసములను ఇప్పించనైనది. లక్ష్మణరాయ పరిశోధకమండలి కార్యకలాపాలను పరిషత్తు పునరుజ్జీవింప జేసినది. తెలంగాణ రచయితల సంఘస్థాపనకు దోహదము కావించినది. ఇంతేగాక పరిషత్తు తెలంగాణములో

నూతన గ్రంథాలయములను స్థాపించుటకును, శిథిలమై పోయిన గ్రంథ నిలయములను పునరుద్ధరించుటకును కృషిసల్పినది. పల్లెటూళ్ళలోని ప్రాథమిక, మాధ్యమిక పాఠశాలల స్థాపనకు పల్లెప్రజానీకానికి ప్రభుత్వం వారి విద్యాశాఖద్వారా సహాయమొనర్చగలిగినది.

లలితకళలు:- పరిషత్తు వార్షికోత్సవముల సందర్భమున లలిత కళల ప్రదర్శనములు, ఉపన్యాసములు యేర్పాటుచేసి, నృత్య గాన కళా సాహిత్యములను గురించి హైద్రాబాదాంధ్రులకు చక్కని పరిచయమును గలుగజేయుటకై కృషిసల్పినది. 1952 అక్టోబరు నెలలో శ్రీ నటరాజ రామకృష్ణగారిని ఆహ్వానించి పరిషత్తు అధ్వర్యాన హైదరాబాదు నగరమందు పలుచోట్ల నాట్యకళా ప్రదర్శనములు తత్సంబంధమైన ఉపన్యాసములు జరిపించడమైనది.

పరిషత్తునకు గల 198 శాఖలలో అనేక శాఖలు పరిషత్తు కేంద్ర సంస్థవలెనే ప్రతి సంవత్సరమును వార్షికోత్సవములు జరుపుచు ఆయా ప్రాంత ప్రజానీకమునకు ఉత్సాహమును, కార్యకర్తల సేవాసక్తిని పెంపొందించుటకు కృషి సల్పినవి. అందు ముఖ్యముగా, ఓరుగల్లు, నిజామాబాదు, బాపట్ల, ఆలూరు, బొంబాయి, ఇభరామపట్నం మున్నగునవి పేర్కొనదగినవి.

బొంబాయి శాఖను గురించి ప్రత్యేకముగా చెప్పకొని పరిషత్తు గర్వించును. కామాటిపురం (బొంబాయి) శాఖా కార్యకర్తలు తోడివారలలో మాతృభాషాసక్తి కలుగ జేయుటకు సారస్వతోత్సవాలు, సభలు జరుపుచున్నారు.

పుస్తకములను ప్రచురించు కార్యక్రమాన్ని కూడా కొన్ని శాఖలు నిర్వహించుచున్నవి. అందు భువనగిరి శాఖవారు "తోడు, నీడ", గానుగు పాడు శాఖ నైపున 'తెలుగు పలుకు' అను పొత్తములు ప్రచురించిరి. అలంపురం శాఖ 'షోడశ మహారాజులు' అను పుస్తకమును ప్రచురించినది.

పరిషత్తు శాఖాకార్యకర్తలు కేంద్రపరిషత్తునకు గావించిన ఈలాటి సహాయ సహకారము లెన్నో గలవు. పరిషత్తునకు శాఖా కార్య కర్తల తోడ్పాటువలన ఈ నాడు పరిషత్తున కింత విస్తృత స్వరూప మేర్పడినదన్న సందేహ మేమియు లేదు.

పరిషత్తు 1950 నుండి 51 వరకు దాదాపు 1½ సంవత్సరములు ప్రతి ఒకటి రెండు జిల్లాల కొరకు చొప్పున ప్రచారకుల నేర్పాటుచేసి వారి జీతభత్యముల భారమును వహించుచు, తెలంగాణ మందంతట పల్లె పల్లెన విరివిగా సారస్వత ప్రచారము గావించినది. ఎందరో యువక కార్యకర్తలు ఎట్టి ప్రతిఫలమున కాశించకయే భాషాసేవజేసి పరిషత్తు కార్యనిర్వహణమున కెంతో సహాయపడిరి. కాని పరిషత్తు ఈనాటివరకు అదేవిధంగా ప్రచారకుల వ్యయభారమును వహించి అంతవిరివిగా ప్రచార కార్యక్రమమును సాగించలేక పోవుచున్నది. దీనికి ముఖ్యకారణము ఆర్థికలోపమే. అయినా, పరిషత్తు ప్రస్తుత ఆర్థిక ఇబ్బందిలో గూడ ఒకరిద్దరు ప్రచారకులను ఈ కార్యక్రమమునకై నియోగించియే యున్నది. ఆర్థిక సహాయ సహకారములు లభించుచో, ఎంతైనా ప్రచారమును సాగించవలెనని ఆశించుచున్నది. ఇందుకై ప్రభుత్వముయొక్క సహకార మెంతైనా అవసరము.

పరిషత్తు ఆదాయ వ్యయముల పట్టికవల్ల పరిషత్తునకు లభించిన విరాళములు తెలియగలవు. పరిషత్తునకు ఆర్థికసహాయము, సభ్యత్వము వల్ల లభించవలసి యున్నది. ఈ సందర్భమున మహబూబునగరం జిల్లా వాసులు ఎక్కువగా పోషకుల సంఖ్యను పెంచినారని చెప్పవలసి యున్నది.

పరిషత్తునకు సొంతి భవనము లేదు. భవనము కట్టించుకొను టకు స్థలమును కోరగా, హైదరాబాద ప్రభుత్వమువారు 1815 చదరపు గజముల స్థలము నగరమధ్యమున ఇచ్చినారు. రెండు లక్షల రూపా యల నిధి పోగుజేసి భవనమును నిర్మించవలసి యున్నది. భవన నిర్మాణ మునకు నిధుల విషయమున స్వల్ప ప్రయత్నమే జరిగినది. శ్రీ వై. సత్య నారాయణ గారు రు. 500 లు ఈ నిధికి ఇచ్చినారు. పరిషత్తు అభిమా

నులు, కార్యకర్తలు ఈ విషయమున ఎక్కువ కృషి సాగించవలసి యున్నది.

పరిషత్తు కార్యనిర్వహణకు తోడ్పడిన కార్యనిర్వాహక సభ్యులకు, ఉపసంఘ సభ్యులకు, కార్యాలయ కార్యకర్తలకు, మరియు ధన సహాయ మొనర్చిన ప్రభుత్వము వారికి, యితరదాతలకు, పత్రికాప్రచారమునకై సహకరించిన పత్రికాధిపతులకు ముఖ్యముగా గోలకొండ పత్రికాధిపతులకు, ఆయా శాఖా కార్యకర్తలకు, ప్రచారకులకు, మేమెంతో కృతజ్ఞులము. వీరి తోడ్పాటు సదా పరిషత్తు కార్యనిర్వహణకు లభించుచుండగలదని ఆశించుచున్నాము.

---

## గమనిక

# వివిధ భాషా సంస్థల ఐక్యత

ప్రపంచ కథానికల పోటీలో ద్వితీయ బహుమానము బడసిన శ్రీ పాలగుమ్మి పద్మరాజుగారి సన్మాన సందర్భమున, 26 భాషాసంస్థలు కలసి శ్రీ పాలగుమ్మి పద్మరాజుగారి సన్మాన సభ ఏర్పాటు చేసినారు. పరిషత్తు కార్యాలయమే ఆ సన్మాన సంఘమునకు కార్యాలయముగా పని చేసినది.

శ్రీ కాశీ కృష్ణమాచార్యులు, శ్రీ రాళ్ళబండి అనంతకృష్ణశర్మ గారల సాహిత్యోపన్యాసములను పరిషత్తు ఏర్పాటు చేసినది.

అనుబంధము :

# ఆంధ్ర సారస్వత పరిషత్తు, హైదరాబాదు

## ప్రచురణలు

| | | పుటలు | వెల | ప్రతులు |
|---|---|---|---|---|
| 1. వ్యాకరణ వివరణము<br>శ్రీ కప్పగంతుల లక్ష్మణ శాస్త్రి | 4 | 94 | 1-0-0 | 8000 |
| 2. విక్రమాంక దేవ చరిత్ర<br>శ్రీ కప్పగంతుల లక్ష్మణ శాస్త్రి | 1 | 30 | 0-8-0 | 500 |
| 3. ఆంధ్రులు-చరిత్ర<br>శ్రీ డా. నేలటూరి వేంకటరమణయ్య | 1 | 84 | 1-0-0 | 1000 |
| 4. ఆంధ్రుల సాంఘిక చరిత్ర<br>శ్రీ సురవరం ప్రతాపరెడ్డి | 2 | 487 | 4-0-0 | 6000 |
| 5. నీతిమంజరి<br>శ్రీ క. లక్ష్మణశాస్త్రి | 2 | 48 | 0-14-0 | 3000 |
| 6. ప్రాథమిక పద్యభాగము<br>పరిషత్తు | 3 | 34 | 0-6-0 | 6000 |
| 7. సారస్వత మంజూష<br>శ్రీ దేవులపల్లి రామానుజరావు | 2 | 150 | 1-8-0 | 6000 |
| 8 మనరాజ్యాంగము<br>శ్రీ పర్సా వేంకటేశ్వరరావు | 1 | 134 | 1-8-0 | 3000 |

| | | | | |
|---|---|---|---|---|
| 9. గ్రంథాలయములు | 1 | 128 | 2-0-0 | 1000 |
| శ్రీ పాతూరి నాగభూషణము | | | | |
| 10. తెలుగు పలుకు | 2 | 56 | 0-6-0 | 6000 |
| శ్రీ గంగుల శాయిరెడ్డి | | | | |
| 11. సైన్సుకథ | 1 | 380 | 4-0-0 | 2000 |
| శ్రీ వేమరాజు భానుమూర్తి | | | | |
| 12. గీర్వాణరూపకము | 1 | 146 | 1-8-0 | 1000 |
| శ్రీ తల్లావఝ్ఝుల శివశంకరస్వామి | | | | |
| 13. ప్రబంధపాత్రలు | 1 | 95 | 1-8-0 | 500 |
| శ్రీ కేశవపంతుల నరసింహశాస్త్రి | | | | |

# అనుబంధము

[పోలీసు చర్యతరువాత, తూప్రాన్ సభలనుండి ఆంధ్ర సారస్వతపరిషత్తు కార్యవర్గములో ఏర్పడిన శాఖలు]

---

## నల్లగొండ జిల్లా:

1. కొండభీమనపల్లె
2. చెరుకుపల్లె.
3. నిడిగొండ
4. చర్లపల్లి
5. తుమ్మలగూడెము
6. కొన్నె
7. ఆకునూరు
8. పల్లెవాడ
9. కొలనుపాక
10. ముత్తవరము
11. యాదగిరిపల్లె
12. వేములపల్లె
13. బచ్చన్నపేట
14. భువనగిరి
15. నల్లగొండ
16. సూర్యాపేట
17. చండూరు
18. తీదేడు
19. వెలుగుపల్లె
20. నాగారము
21. కట్టంగూరు
22. కంచినేపల్లె
23. పుట్టపాక
24. గుండాల
25. రాజపేట
26. దేవరకొండ
27. గొట్టిపర్తి
28. నాగిరెడ్డిపల్లె
29. కొడగండ్ల
30. వల్మిడి
31. ఖిల్లాషాపురము
32. తేకుమట్ల
33. వీరపల్లి
34. నకిరేకల్లు
35. చందుపట్ల
36. చలకుర్తి
37. కొప్పోలు
38. చింతపల్లె
39. పెదవంగర
40. జనగామ
41. మిర్యాలగూడెము
42. చిట్యాల
43. అగ్గూరు
44. చేరియాల
45. దేవరొప్పుల
46. తొండ
47. దాచవరము
48. గానుగుపాడు
49. రేబర్తి
50. భీమనపల్లె
51. ఆత్మకూరు
52. గూడూరు
53. పలివెల
54. ఆలేరు
55. తిప్పర్తి
56. పస్నూరు
57. మోత్కూరు
58. నవాబుపేట
59. నారాయణపురము
60. హుజూరునగరము
61. కాపుగల్లు
62. కేతేపల్లె

## మహబూబునగరము జిల్లా:

63. మహబూబునగర్
64. నాగరకర్నూలు
65. బిజనేపల్లె
66. ఆవంచ
67. అచ్చంపేట
68. రఘుపతిపేట
69. వనపర్తి
70. నారాయణపేట
71. పరిగి
72. తెలుకపల్లె
73. వట్టెము
74. ఆత్మకూరు అమరచింత
75. కోడేరు
76. వంగూరు
77. కేతేపల్లె
78. పాలెము
79. గుడ్లనర్వ
80. అయ్యవారుపల్లె
81. పోలేపల్లె
82. తిమ్మాజిపేట
83. మాధారము
84. వెలుదండ
85. మొగిలిగిద్ద
86. కొల్లాపురము
87. గోపాలపేట
88. మఖ్తల్
89. వడ్డెమాను
90. రంగాపురము
91. పానగల్లు
92. జడ్చర్ల
93. మరికల్లు
94. నవాబుపేట

## మెదకు జిల్లా:

95. సిద్దిపేట
96. త్రిగుళ్ల
97. జోగిపేట
98. రామాయంపేట
99. సదాశివపేట
100. కంది
101. కొండపాక
102. శివంపేట
103. నంగునూరు
104. కూచారము
105. నెల్లుర్తి
106. మాసాయిపేట
107. మంగంపేట
108. పీర్లపల్లి
109. గోమవరము
110. వికారాబాద
111. టేకుమాల్
112. జగదేకపురము
113. పొట్టిపల్లి
114. సంగారెడ్డి
115. అల్లాదుర్గము
116. డాకూరు
117. దుబ్బాక
118. చింతలచెర్వు
119. శంకరుపల్లె
120. పులిమామిడి
121. నార్సింగి
122. పాపన్నపేట
123. తూప్రాన్
124. కుకునూరు
125. కోటపల్లె
126. శంకరంపేట
127. క్షీరసాగరము

## కరీంనగరము జిల్లా:

128. బెజ్జంకి
129. జగత్యాల
130. సిరిసిల్లా
131. మెట్టుపల్లె
132. పెద్దపల్లె
133. కోనేరుపల్లె

134. పర్కాల
135. జమ్మికుంట
136. ఆరెంద
137. సుల్తానాబాద
138. మంథెన
139. కమాన్‌పురము
140. వడ్లూరు బేగంపేట
141. ధర్మపురి
142. పంథిని
143. మహాదేవపురము
144. గరిగకుర్తి
145. వేములవాడ
146. కరీంనగరము
147. తోటపల్లె
148. ముస్తాబాద
149. కోరుట్ల
150. గంభీరావుపేట

## ఓరుగల్లు జిల్లా:

151. ఆత్మకూరు
దేశాయి
152. ఓరుగల్లు
153. మానుకోట
154. నిధానపురము
155. మంగపేట
156. ఘనపురము
157. చింతగట్టు
158. జఫర్‌గడ్
159. నెల్లికుదురు
160. పర్వతగిరి
161. గుర్తూరు
162. కొలనూరు
163. కొండపర్తి
164. మాటేడు
165. పాల్వంచ
166. వేమునూరు
167. ఖమ్మంమెట్టు
168. రాయెపర్తి
169. ఇల్లెందు
170. వైరా
171. శుభ్రపేడు
172. హసన్‌పర్తి
173. ఇనుగుర్తి
174. ములుగు
175. నారాయణ
పురము
176. వర్ధన్నపేట
177. చినపెండ్యాల
178. కరకగూడెము
179. నర్సంపేట

## నిజామాబాదు జిల్లా :

180. దోమకొండ
181. బోధన్
182. ఎడవల్లి
183. బీబీపేట
184. నిజాంసాగర్
అచ్చంపేట
185. బిక్కనూరు
186. రాజంపేట
187. కొండాపురము
188. రుద్రవరము
189. గన్నారము
190. వేల్పూరు
191. నిజామాబాద
192. బాసువాడ
193. రామారెడ్డి
194. గాంధారి
195. ఆర్మూరు
196. చేపూరు
197. కామారెడ్డి
198. చిల్లరిగి
199. లక్కవరము

200. చక్కెరనగరము 202. కోటగిరి 204. ఎల్లారెడ్డి
201. అహల్యాపురము 203. పిట్లము 205. బనోల

## హైదరాబాదు జిల్లా:

206. హైదరాబాద నగరము
207. మల్కాజిగిరి
208. కొంగరరావిర్యాల
209. షంషాబాద
210. ఇభరాము పట్టణము
211. మేడిపల్లె
212. సికింద్రాబాద నగరము

## ఆదిలాబాదు జిల్లా:

213 నిర్మల
214. బెల్లంపల్లి
215. సిరిపురము టౌను
216. లక్సెట్టిపేట
217. మంచిర్యాల
218. కానాపురము
219. కిష్టాపురము
220. ధర్మారము
221. బోథ్
222 చెన్నూరు
223. కాగజునగరము

## గుల్బర్గా జిల్లా:

224. హకీంపేట
225. కోశిగి
226. కొడంగల్లు
227. తాండూరు
228. గుండుమళ్ళ
229. మద్దూరు

## రాయచూరు జిల్లా:

230. అలంపురము 231. గద్వాల

## బీదరు జిల్లా:

232. తుర్కపల్లి 233. జహీరాబాద 234. నారాయణఖేడు

## రాష్ట్రేతర ప్రాంతాలు:

235 బొంబాయి
కామాటిపురము

## గుంటూరు జిల్లా

236. బాపట్ల

## కర్నూలు జిల్లా:

237. నంద్యాల

## బళ్లారి జిల్లా:

239. ఆలూరు

## కృష్ణా జిల్లా:

238. విద్యానసము,
(పామఱ్ఱు,)

# ఆంధ్రసారస్వత పరిషత్తు

ప్రధానకార్యాలయము, హైదరాబాదు (దక్షిణ).

## 1949 జూలై నుండి 1952 వరకు

7 పరీక్షల పరీక్షా కేంద్రాలు.

### నల్లగొండ జిల్లా:

1. హుజూరునగరము
2. భువనగిరి
3. కొలనుపాక
4. దాచవరము
5. వీరవల్లి
6. అనూరు
7. నాగిరెడ్డిపల్లె
8. కంచినేపల్లె
9. గుండాల
10. యాదగిరిపల్లె
11. జనగాము
12. దేవరుప్పుల
13. పెదవంగర
14. బచ్చన్నపేట
15. చేరియాల
16. గానుగుపాడు
17. రేబర్తి
18. ఆకునూరు
19. ముత్తివరము
20. సూర్యాపేట
21. గొట్టిపర్తి
22. తొండ
23. నాగారము
24. కొన్నె
25. నల్లగొండ
26. కొప్పోలు
27. భీమనపల్లె
28. చండూరు
29. మట్టిగూడెము
30. చిట్యాల
31. చింతపల్లె
32. మునిగల్లు
33. నారాయణపురము
34. చర్లపల్లి
35. కట్టంగూరు
36. చలకుర్తి
37. పలివెల
38. నకిరేకల్లు
39. పుట్టపాక
40. చందుపట్ల
41. తీదేడు
42. పల్లెవాడ
43. పసునూరు
44. తిప్పర్తి
45. దేవరకొండ
46. మిర్యాలగూడెము
47. వెలుగుపల్లె

### మెదకు జిల్లా:

48. రామాయంపేట
49. సిద్దిపేట
50. సంగారెడ్డి
51. మాసాయిపేట
52. క్షీరసాగరము
53. సదాశివపేట
54. అల్లాదుర్గము
55. పొట్టిపల్లి
56. నంగునూరు

57. పాపన్నపేట
58. తేకుమాలు
59. డాకూరు
60. కొండపాక
61. జగదేకపురము
62. గోమనవరము
63. జోగిపేట
64. శంకరంపేట
65. కోటపల్లె
66. దుబ్బాక
67. మంగంపేట
68. కుకునూరు
69. తూప్రాను
70. పీర్లపల్లె
71. శివంపేట
72. వికారాబాదు
73. వెల్దుర్తి
74. చింతలచెర్వు
75. శంకరుపల్లె
76. పులిమామిడి
77. త్రిగుళ్ళ
78. కుంచారము
79. నార్సింగి

## మహబూబునగరము జిల్లా:

80. మహబూబు నగరము
81. కోడేరు
82. ఆవంచ
83. వంగూరు
84. వట్టెము
85. అయ్యవారుపల్లె
86 మరికల్లు
87. రఘుపతిపేట
88 నారాయణపేట
89 నాగరకర్నూలు
90. మఖ్తల్
91. మొగిలిగిద్ద
92. కొల్లాపురము
93. తిమ్మాజిపేట
94. వనపర్తి
95. పానగల్లు
96. పరిగి
97. బిజినేపల్లె
98. అచ్చంపేట
99. అమరచింత ఆత్మకూరు
100. కేతెపల్లె
101. గోపాలపేట
102. గుడ్లసర్వ
103. మాధారము
104. వెలుదండ

## ఓరుగల్లు జిల్లా:

105. ఓరుగల్లు
106. శుభ్రవీడు
107. కొండపర్తి
108. హాసన్‌పర్తి
109. జఫర్‌గడ్
110. పర్వతగిరి
111. రాయపర్తి
112. మానుకోట
113. గుర్తూరు
114. ఆత్మకూరు దేశాయి
115. ఖమ్మంమెట్టు
116. వేంసూరు
117. నారాయణపురం
118. నిధానపురము
119. మంగపేట
120. ఇల్లెందు
121. వైరా
122. ఘనపురము
123. మాటేడు
124. పాల్వంచ
125. నర్సన్నపేట
126. చినపెండ్యాల

## కరీంనగరము జిల్లా:

127. కరీంనగరము
128. కోరుట్ల
129. కోనేరుపల్లె
130. జగత్యాల
131. మెట్టుపల్లె
132. పెద్దపల్లె
133. జమ్మికుంట
134. పర్కాల
135. వేములవాడ
136. బెజ్జంకి
137. శిరిసిల్ల
138. ఆరెంద
139. మంథెన
140. కోటపల్లె
141. గుండి

## నిజామాబాదు జిల్లా :

142. నిజామాబాదు
143. రుద్రవరము
144. బిక్కనూరు
145. బాసువాడ
146. కామారెడ్డి
147. ఎల్లారెడ్డి
148. ఆర్మూరు
149. బీబీపేట
150. అహల్యాపురము
151. చిల్లరిగి
152. బోధన్
153. చక్కరనగరము
154. రామారెడ్డి

## ఆదిలాబాదు జిల్లా:

155. మంచిర్యాల
156. లక్సెట్టిపేట
157. ధర్మారము
158. చెన్నూరు
159. సిరిపురము
160. కానాపురము
161. కిష్టాపురము
162. బోథ్
163. బెల్లంపల్లి
164. నిర్మల

## హైద్రాబాదు జిల్లా:

165. హైదరాబాదు
166. సికింద్రాబాదు
167. ఇభరాము పట్టణము
168. షంషాబాద
169. కొంగరవిరాళ్యాల
170. కవాడిగూడెము
171. బేగంపేట గురుకులము
172. మేడిపల్లె

## గుల్బర్గా జిల్లా:

173. కోశిగి
174. కోడంగల్లు
175. హాకింపేట
176. గుండుమళ్ల
177. తాండూరు

**రాయచూరు జిల్లా:**

178. గద్వాల 179. అలంపురము

**బీదరు జిల్లా:**

180. తుర్కపల్లె 181. నారాయణఖేడ్ 182. జహీరాబాదు

# మద్రాసు రాష్ట్రము

**గుంటూరు జిల్లా:**

183. బాపట్ల

**కర్నూలు జిల్లా :**

184. నంద్యాల

**కృష్ణా జిల్లా:**

185. విద్యావనము, (పామర్రు,)

**బళ్లారి జిల్లా:**

186. ఆలూరు

# బొంబాయిరాష్ట్రము

187. బొంబాయి

## విశారద పరీక్షా కేంద్రాలు:

1. హైదరాబాదు
2. ఓరుగల్లు
3. బాపట్ల
4. నంద్యాల
5. విద్యావనము

# ఆంధ్రసారస్వత పరిషత్తు

హైదరాబాదు.

## 1949 నుండి 1952 వరకు నడుపబడుచున్న వయోజన రాత్రిపాఠశాలలు

నల్లగొండ జిల్లా

1. ఆకునూరు
2. గొట్టిపర్తి
3. దేవరొప్పుల
4. కొండాపురము
5. వల్లంపట్ల
6. బస్వాపురము
7. బెక్కల్
8. కమలాయెపల్లె
9. భువనగిరి
10. నెముకుగోముల
11. అంకుశాపురము
12. గొల్లగూడెము
13. నకిరేకల్లు
14. తొండ
15. జనగాము
16. చినకాపర్తి
17. అవుతాపురము
18. ఫణిగిరి
19 దాచారము
20. చేర్యాల
21. రేగుల
22. గానుగుపాడు
23. చింతపల్లి
24. వెంపటి
25. కస్తాల
26. నారాయణపురం
27. తుమ్మలగూడెం
28. అరూరు
29. కొండగడప
30. కొన్నె

మహబూబునగరము జిల్లా

31. కంకల్లు
32 నస్కల్లు
33. అంగిడిచిట్టంపల్లె
34. మొకరాల
35 వంగూరు
36 మహదేవునిపేట
37. నేడిపూరు
38. కొప్పునూరు
39. మరికల్లు
40. మార్చాల
41. భల్లానుపల్లె
42. ఇప్పలపల్లె
43. మాచినేపల్లె
44. బొమ్మనపల్లె
45. ఉప్పరపల్లె
46. జటప్రోలు

నిజామాబాదు జిల్లా

47. దేశాయిపేట
48. చిల్లరిగి
49. డిచుపల్లి
50. దోమకొండ
51. ఆర్మూరు
52. దూపల్లి

53. నిజామాబాద హరిజనవీధి
54. ,, బద్దిగెని
55. ,, జండాగల్లి
56. నడుకుడు
57. ముప్రకాల
58. లక్కవరము
59. గన్నారము
60. రామపురము

మెదకు జిల్లా

61. పులిమామిడి
62. టేకుమాల్
63. మంగంపేట
64. మైసంపల్లె
65. ఆరూరు
66. బొంతిపల్లె
67. కాసాల
68. పుల్లూరు
69. పొట్టిపల్లె
70. ఊట్ల
71 గుంతపల్లె
72 వడియారము
73. చింతలచెర్వు

హైద్రాబాదు జిల్లా

74. మేడిపల్లె
75 కొంగరరావిర్యాల
76. తుర్కయాంజాల
77. నానక్ నగరము
78. పంది ఎనపర్తి
79. శేరిగూడెము
80. తాడిపర్తి
81. ఆగాపల్లె
82. గునుగల్లు
83. పెదకొంగర

ఓరుగల్లు జిల్లా

84. ఓరుగల్లు
85. ,, రైల్వేగేటు
86. ,, రంగశాయి పేట
87. ,, నరేంద్రనగరం
88. పాపన్న పేట
89. నారాయణపురం
90. ముష్టికుంట్ల

గుల్బర్గా జిల్లా

91. హాకీం పేట
92. కోశిగి
93. కోశిగి హరిజనవీధి

రాయచూరు జిల్లా

94. అలంపురము
95. ,, చేనేత సంఘం

**కరీంనగరము జిల్లా:**

96. నాగారము 97. వైడిపల్లె

**ఆదిలాబాదు జిల్లా:**

98. బెల్లంపల్లి

---

| | |
|---|---|
| మొత్తం విద్యార్థులు | 3393 |
| పరీక్షలలో పాల్గొన్న విద్యార్థులు | 1580 |
| ఉత్తీర్ణులైన విద్యార్థులు | 631 |

---

కొత్తగూడెము గనుల కార్మికులలో పరిషత్తు అధ్వర్యాన

నడుపబడుచున్న వయోజన పాఠశాలలు

16, వయోజన పాఠశాలలు

1200 మంది విద్యార్థులు శిక్షణ పొందినారు.

## పోలీసుచర్య తరువాత

## తూఫురాన్ సభల నుండి ఆంధ్ర సారస్వత పరిషత్తు ఏర్పచిన వివిధ పరీక్షలలో పాల్గొన్న అభ్యర్థుల వివరములు

| క్రమసంఖ్య | సంవత్సరము | | ప్రాథమిక | మాధ్యమిక | ప్రవేశ | మొత్తః |
|---|---|---|---|---|---|---|
| 1. | జూలై | 1949 | 657 | 1088 | 754 | 2499 |
| 2. | మార్చి | 1950 | 1824 | 2740 | 1527 | 6091 |
| 3. | అక్టోబరు | 1950 | 1603 | 1534 | 1065 | 4202 |
| 4. | మే | 1951 | 1497 | 1505 | 993 | 3995 |
| 5. | నవంబరు | 1951 | 631 | 423 | 450 | 1504 |
| 6. | మే | 1952 | 578 | 386 | 539 | 1503 |
| 7. | డిసంబరు | 1952 | 522 | 355 | 402 | 1279 |
| | | | 7311 | 8031 | 5730 | 21073 |

### విశారద పరీక్ష

| | | | | |
|---|---|---|---|---|
| 1. | మార్చి | 1951 | విశారద పూర్వభాగము | 165 |
| 2. | మే | 1952 | విశారద పూర్వభాగము | 101 |
| | ,, | ,, | ఉత్తరభాగము | 43 |
| | | | మొత్తం విద్యార్థులు | 309 |

## 1949 సం. నుండి 1953 సం. వరకు

## ఆంధ్రసారస్వత పరిషత్తు

# కార్యనిర్వాహకవర్గ సభ్యులపట్టిక

## 1949 నుంచి 1950 వరకు

| | | |
|---|---|---|
| శ్రీ | ఇల్లిందల రామచంద్రరావుగారు, | అధ్యక్షులు |
| ,, | దేవులపల్లి రామానుజరావుగారు, | ఉపాధ్యక్షులు |
| ,, | నూకల నరోత్తమ రెడ్డిగారు, | ,, |
| ,, | బూర్గుల రంగనాధరావుగారు, | కోశాధ్యక్షులు |
| ,, | పులిజాల హనుమంతరావుగారు, | ప్రధాన కార్యదర్శి |
| ,, | వెల్దుర్తి మాణిక్యరావుగారు, | సహాయ కార్యదర్శి |
| ,, | వెంకటరామయ్య జోషిగారు, | ,, |
| ,, | మాడపాటి హనుమంతరావుగారు, | సభ్యులు |
| ,, | ఆదిరాజు వీరభద్రరావుగారు, | ,, |
| ,, | కప్పగంతుల లక్ష్మణశాస్త్రిగారు, | ,, |
| ,, | ఖండవల్లి లక్ష్మీరంజనంగారు, | ,, |
| ,, | గడియారం రామకృష్ణశర్మగారు, | ,, |
| ,, | బిదురు వెంకటశేషయ్యగారు, | ,, |
| ,, | కాళోజీ నారాయణరావుగారు, | ,, |
| ,, | ధనళా శ్రీనివాసరావుగారు, | ,, |
| ,, | పోలా కృష్ణమూర్తిగారు, | ,, |
| ,, | సంగెం లక్ష్మీబాయమ్మగారు, | ,, |
| ,, | యస్. చెన్నారెడ్డిగారు, | ,, |
| ,, | తాళ్ళూరి రామానుజస్వామిగారు, | ,, |

| | |
|---|---|
| శ్రీ వెంకటరాజేశ్వర జోష్యులుగారు, | సభ్యులు |
| ,, రాయపురాజు వెంకట రామారావుగారు, | ,, |
| ,, పి. వి. నరసింహారావుగారు, | ,, |
| ,, కే. వి. కేశవులుగారు, | ,, |
| ,, వెంకటరాజన్న అవధానిగారు, | ,, |

# 1950 నుండి 52 వరకు

| | |
|---|---|
| శ్రీ పర్సా వెంకటేశ్వరరావుగారు | అధ్యక్షులు |
| ,, యస్. దుర్గయ్యగారు | ఉపాధ్యక్షులు |
| ,, దేవులపల్లి రామానుజరావుగారు | ,, |
| ,, నూకల నరోత్తమరెడ్డిగారు, | కోశాధ్యక్షులు |
| ,, పులిజాల హనుమంతరావుగారు, | ప్రధాన కార్యదర్శి |
| ,, గడియారం రామకృష్ణశర్మగారు, | సహాయ కార్యదర్శి |
| ,, వెంకటరామయ్య జోషిగారు, | ,, |
| ,, యస్. కె. రావుగారు, | సభ్యులు |
| ,, కప్పగంతుల లక్ష్మణశాస్త్రిగారు, | ,, |
| ,, ఖండవల్లి లక్ష్మీరంజనముగారు, | ,, |
| ,, గార్లపాటి రాఘవరెడ్డిగారు, | ,, |
| ,, వెంకటరాజేశ్వర జ్యోషిగారు, | ,, |
| ,, ఆదిరాజు వీరభద్రరావుగారు, | ,, |
| ,, సంగం లక్ష్మీబాయమ్మగారు, | ,, |
| ,, రాజా వేంకటమురళీ మనోహర్ రావుగారు, | ,, |
| ,, కె. వి. కేశవులుగారు, | ,, |
| ,, పి. వి. నరసింహారావుగారు, | ,, |
| ,, చవ్వాకుపల్లి హనుమంతరెడ్డిగారు, | ,, |
| ,, గౌతమరావుగారు, | ,, |
| ,, కొండా శకుంతలాదేవిగారు, | ,, |
| ,, పి. లక్ష్మారెడ్డిగారు, | ,, |
| ,, బెల్దె జగదీశ్వరయ్యగారు, | ,, |
| ,, పల్లా దుర్గయ్యగారు, | ,, |
| ,, ధవళా శ్రీనివాసరావుగారు, | ,, |
| ,, కే. వేదాంతాచారిగారు, | ,, |

# 1952 - 53

| | |
|---|---|
| శ్రీ దేవులపల్లి రామానుజరావుగారు, | అధ్యక్షులు |
| ,, యం. రామప్పగారు, | ఉపాధ్యక్షులు |
| ,, యస్. నరోత్తమరెడ్డిగారు, | ,, |
| ,, పర్సా వెంకటేశ్వరరావుగారు, | కోశాధ్యక్షులు |
| ,, పులిజాల హనుమంతరావుగారు, | ప్రధాన కార్యదర్శి |
| ,, గడియారం రామకృష్ణశర్మగారు, | సహాయ కార్యదర్శి |
| ,, దాశరథి కృష్ణమాచార్యులుగారు, | ,, ,, |
| ,, పల్లా దుర్గయ్యగారు, | సభ్యులు |
| ,, కప్పగంతుల లక్ష్మణశాస్త్రిగారు, | ,, |
| ,, ఆదిరాజు వీరభద్రరావుగారు, | ,, |
| ,, ధేరం వెంకటనాథశాస్త్రిగారు, | ,, |
| ,, సంగెం లక్ష్మీబాయమ్మగారు, | ,, |
| ,, కొండా శకుంతలాదేవిగారు, | ,, |
| ,, ఇల్లిందల సరస్వతీదేవిగారు, | ,, |
| ,, గుండవరం హనుమంతరావుగారు, | ,, |
| ,, చవ్వటుపల్లి హనుమంతరెడ్డి గారు, | ,, |
| ,, పి. వి. నరసింహారావుగారు, | ,, |
| ,, కె. వి. కేశవులుగారు, | ,, |
| ,, జె. గౌతమరావుగారు, | ,, |
| ,, కె. వెంకటరామారావుగారు, | ,, |
| ,, ధవళా శ్రీనివాసరావుగారు, | ,, |
| ,, వెంకటరాజేశ్వర జోష్మిగారు, | ,, |
| ,, వేదాంతాచారిగారు, | ,, |
| ,, మడూరి శంకరలింగం గుప్తగారు, | ,, |
| కీ॥ శే॥ యన్. కె. రావుగారు, | ,, |